బ్రహ్మ పురాణాంతర్గత

# శ్రీ కాళేశ్వర తీర్థ క్షేత్ర మాహాత్మ్యమ్

పూర్వం ఒకానొక సమయంలో నారదుడు బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి ఓ జగత్పితా! మీ నుండి తపస్సు, యజ్ఞ, దానముల గురించిన అన్ని విషయములను నేను విన్నాను. ఇప్పుడు స్వర్గ, మర్త్య, పాతాళ లోకములలో ఎన్ని తీర్థములు ఉన్నవి? వాటిలో ఏది విశిష్టమైనదో దయతో నాకు చెప్పుమని ప్రార్థించగా అప్పుడు బ్రహ్మ నారదునితో ఓ నారదా! మూడులోకములలోను తీర్థము అతి పవిత్రమైనది. అందునా జమ్బూద్వీపములోని తీర్థములు విశేషము.

స్వర్గ, మర్త్య, పాతాళములలోని తీర్థములు దైవములు, ఆసురములు, ఆర్షములు, మానుషములని నాలుగు విధములుగా దేవతలచేత మూడు లోకాలలోను ప్రసిద్ధి పొందినవి. **"బ్రహ్మ విష్ణు శివైశ్చైవ నిర్మితం దైవముచ్యతే"** (గౌతమీ మాహాత్మ్యము 1-1-20) బ్రహ్మ,విష్ణు,శివులచేత నిర్మించబడిన తీర్థములు దైవతీర్థములని చెప్పబడుతున్నవి. **"దైవ ప్రభావాత్తపస ఆర్షాణ్యపిచ తాన్యపి"** ఋషులు తీవ్రమైన తపస్సును ఆచరించి ఆ తపస్సు ప్రభవముచేత లేదా దైవానుగ్రహము వలన నిర్మించిన తీర్థములను ఆర్షములని అంటారు. **"ఆసురైరావృతాన్యాసం తదేవాసురముచ్యతే"** ఇట్టి ఆర్షతీర్థములు ఆసురబృందములచే ఆవరింపబడినచో వాటిని ఆసురతీర్థములంటారు. **'మానుషైః కారితాన్యాహుర్మానుషాణీతి నారదా"** తమ తమ అభీష్ట సిద్ధిని పొందుటకు మానవులచేత నిర్మించబడే తీర్థములు మానుషములు. ఈ విధంగా తీర్థములు నాలుగు విధములుగా విభజింపబడినవి.

శ్లో. **మానుషేభ్యశ్చ తీర్థేభ్య ఆర్షం తీర్థమనుత్తమమ్ ।**
**ఆర్షేభ్యశ్చ తీర్థేభ్యః ఆసురం బహుపుణ్యదం ।**
**ఆసురేభ్యస్తథా పుణ్యం దైవం తత్సార్వకామికమ్ ।**
(గౌతమీ మాహాత్మము 1-1-18)

తా. మానుష తీర్థములకన్న ఆర్షతీర్థములు ఉత్తమములు. ఆర్షతీర్థములకన్న ఆసురతీర్థములు చాలా పుణ్య ప్రదమైనవి. ఈ ఆసుర తీర్థములకంటే దైవతీర్థములు అత్యంత ఉత్తమమైనవి. సకల జనుల కోరికలను నెరవేర్చునవి.

హిమాలయాలనుండి వింధ్యపర్వతముల మధ్యలో ఉన్న ఆరు నదులు, వింధ్య పర్వతాలనుండి దక్షిణ సముద్రాల మధ్యలో ఆరునదులు, మొత్తం ఈ పన్నెండు నదులు దేవసంభవములుగా కీర్తించబడుతున్నవి. వీటిలో గోదావరి నది మొదటిది.

అటువంటి పవిత్ర గోదావరీ నదీతీరంలో వెలసిన క్షేత్రమే శ్రీ కాళేశ్వర క్షేత్రం. ఈక్షేత్రమును గురించి "కుశతర్పణ తీర్థవర్ణన"మనే పేరుతో బ్రహ్మపురాణాంతర్గత గౌతమీ మహాత్మ్యములోని 92వ అధ్యాయమున సాక్షాత్తు బ్రహ్మదేవునిచే నారదునికి ఈ క్షేత్ర మాహాత్మ్యం వివరించబడినది.

సృష్టికి పూర్వం బ్రహ్మ ఈ ప్రపంచాన్ని సృష్టించేందుకు నిశ్చయించుకుని దేవయజనమనే యజ్ఞాన్ని నిర్వహించేందుకు సిద్ధమై అందుకు కావలసిన యజ్ఞసాధనములను పొందినవాడై యజ్ఞాన్ని ఆచరించగా అపుడు పరమేశ్వరుడు ప్రత్యక్షమైనాడు. అతనినుండి పంచభూతములు, దిక్కులు, కాలములు, చాతుర్వర్ణములు, పశుపక్ష్యాదులు, క్రిమి కీటకాదులు ఆవిర్భవించినవి. యజ్ఞము పరిపూర్ణమైనది. ఆ యజ్ఞసాధనమైన ప్రణీతా పాత్రనుండి వచ్చిన ప్రణీతోదకమే ప్రణీత నదిగా మారినది. ఆ తర్వాత దర్భలచే మార్జన చేసి ప్రణీత పాత్రను విసర్జించెను. మార్జన చేసే సమయంలో ఆ బిందువులు ఎక్కడైతే పడినాయో అవి అచ్చట తీర్థములైనాయి. మార్జనము చేసిన దర్భలు ఎక్కడ పడవేయబడినవో ఆ శుభస్థలమునే కుశతర్పణ తీర్థమని చెప్పబడుతుంది.

శ్లో. **కుశతర్పణ దేశేతు తత్తీర్థం కుశతర్పణమ్ ॥**
**కుశైశ్చ తర్పితాః సర్వే కుశతర్పణముచ్యతే ।**
**పశ్చాచ్చ సంగతా తత్రగౌతమీ కారణాన్తరాత్ ॥**
(గౌ.మా.92-64)

తా. కుశములచే (దర్భలచే) అందరు తృప్తిని పొందినారు కాబట్టి ఆ ప్రదేశమునకు కుశతర్పణమనే పేరు సార్థకమైనది. దేవనదియైన గోదావరి ఇక్కడే ప్రణీతానదితో, అంతర్వాహిని యైన సరస్వతి నదితో సంగమించి త్రివేణి సంగమముగా రూపుదిద్దుకున్నది. ఈ స్థలము దండకారణ్యమున ఉన్నది.

## క్షేత్ర ప్రాశస్త్యము

శ్లో. మద్దేవ యజనంచేదం దండకారణ్య ముచ్యతే॥
ధర్మబీజం ముక్తిబీజం దండకారణ్య ముచ్యతే।
విశేషాద్గౌతమశ్శిష్టో దేశః పుణ్యతమో భవేత్॥
(గౌ. మా. 92-68)

తా. బ్రహ్మయజ్ఞము దండకారణ్యమున జరిగినది. దండకారణ్యము ధర్మప్రదము, ముక్తిప్రదము. విశేషముగా గోదావరి నదితో (గౌతమీ) కలసి ఉండటం వలన ఈ ప్రదేశము అత్యంత పుణ్యప్రదమైనది.

శ్లో. ఉభయోస్తీరయోస్తత్ర తీర్థాన్యాహుర్మనీషిణః।
షడశీతి సహస్రాణి తేషుపుణ్యం పురోదితమ్॥
వారణస్యా అపి మునే కుశతర్పణముత్తమమ్।
న అనేన సదృశం తీర్థం విద్యతే సచరాచరే॥
బ్రహ్మహత్యాది పాపానాం స్మరణాదపి నాశనం।
తీర్థమేతన్మునే ప్రోక్తం స్వర్గద్వారం మహీతలే॥
(గౌ. మా. 92-76)

తా. ఈ కుశతర్పణ (కాళేశ్వర) క్షేత్రములోని ఉభయ తీరములందు 86వేల తీర్థములున్నట్లు పెద్దలు చెప్పెదరు. ఈక్షేత్రం వారణాసి కంటే కూడా ఉత్తమమైనది. సకల జగత్తులో దీనినిమించిన తీర్థము లేదు. దీని గురించి స్మరించిన మాత్రముచేత బ్రహ్మహత్యాది దోషములు తొలగిపోతాయి. ఈ తీర్థము భూమిపై ఉన్న స్వర్గద్వారము.

## ఈక్షేత్రములో స్నాన, దానాది ఫలము

శ్లో. ప్రణీతా సంగమేచాపి కుశతర్పణ ఏవవా।
స్నానదానాది యఃకుర్యాత్సగచ్ఛేత్పరమం పదమ్॥
(గౌ. మా. 92-74)

తా. ప్రణీతా సంగమమైన ఈ క్షేత్రమున ఎవరైతే స్నానము, దానము మొదలైనవి ఆచరిస్తారో వారు పరమపదాన్ని పొందుతారు. కుశతర్పణమని ప్రణీతా సంగమమని చెప్పబడిన ఈ శ్రీ కాళేశ్వర తీర్థం భుక్తి, ముక్తి ప్రదాయకము.

శ్లో. స్మరణం పఠనంవాపి శ్రవణం చాపిభక్తితః ।
సర్వకామప్రదం పుంసాం భుక్తిముక్తి ప్రదాయికం ॥
(గౌ. మా. 92-75)

తా. ఈ కాళేశ్వర క్షేత్రమును గురించి స్మరించినా, చదివినా, విన్నా సర్వకోరికలు నెరవేరును.

## స్థలమహాత్యం

కాళేశ్వర క్షేత్రములోని ప్రధాన దైవం శ్రీకాళేశ్వర ముక్తీశ్వర స్వామి. ఒకే పానవట్టంపై రెండు లింగాలు ఉండటం ఇక్కడి ప్రత్యేకత. ఇది దేశంలో మరెక్కడాలేదు. అదే విధంగా గర్భాలయానికి నాలుగు వైపుల నాలుగా ద్వారాలు మరో ప్రత్యేకత. స్కాందపురాణంలోని కాళేశ్వర ఖండం ప్రకారం ఇక్కడి ముక్తీశ్వర స్వామి వారిని దర్శించుకున్న వారు దర్శనమాత్రంచేత వారి పాపాలు తొలగి మరణానంతరము ముక్తిని పొంది స్వర్గలోకానికి వెలుతుండటంతో యమునికి పని లేకుండా పోయింది. దానితో యమధర్మరాజు ఈ దేవాలయ ప్రాంగణంలో తపస్సు ఆచరించగా ప్రత్యక్షమైన శివునికి ఇక్కడ దర్శనం చేసుకున్న వారంతా స్వర్గలోకానికి వెలుతుండటంతో యమలోక ప్రాభవం, భూలోకంలో పాపభీతి లేకుండా పోయాయని విన్నవించగా, అప్పుడు శివుడు ఈ క్షేత్రంలో నీ పేరుతో ఒక లింగాన్ని ప్రతిష్ఠించు. దాన్ని దర్శించకుండా నా దర్శనం చేసుకున్న వారు యమలోకాన్ని పొందుతారని వరమిస్తాడు. యముడు ప్రతిష్ఠించిన లింగమే కాళేశ్వర లింగం. యముడు తపస్సు చేసిన యమకోణం నేటికి మనం దర్శించవచ్చు. ఇక్కడ శివుడిపై అభిషేకించిన జలం గోదావరిలో కలుస్తుంది

## ఎలా వెళ్ళాలి

కాళేశ్వర క్షేత్రం కరీంనగర్ జిల్లాలోని ప్రధాన శైవ క్షేత్రం. ఇది జిల్లా ప్రధాన కేంద్రం కరీంనగర్ పట్టణం నుండి130కి.మీ దూరం, జిల్లాలోని మంథని నుండి 50 కి.మీ.దూరం, వరంగల్ నుండి 110కి.మీ.దూరం ఉంటుంది. అన్ని చోట్లనుండి బస్సు సౌకర్యం ఉన్నది. రైలు సౌకర్యం లేదు. ఇక్కడ బస చేయడానికి పెద్దగా వసతులు లేవు.

– అప్పాల శ్యామప్రణీత్ శర్మ అవధాని
వేదపండితులు, అచ్చలాపూర్, జి. ఆదిలాబాద్

అఖండ గోదావరీ పుష్కర 'దర్శనమ్'

వ్యాస రచన

**అప్పాల శ్యామ్‌ప్రణీత్ శర్మ అవధాని**

వేదపండితులు

అచ్చులాపూర్, మంచిర్యాల జిల్లా, తెలంగాణ

సెల్ : 9440951366

aspsharma84@gmail.com

xxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxxx

**అతి త్వరలో రాబోవు మాగ్రంథం**

# " గోపద్మవ్రతోద్యాపనము "

**(గురువార ఏకాదశీ వ్రత సహితము)**

---